

# ముగ్గురు యక్షిణులు

ఒక రైతుకు మంగళుడు అని ఒక కొడుకుండేవాడు. మంగళుడికి పొలం పనిలో ఏమీ ఆసక్తి లేకపోవటం గమనించి, రైతు వాణ్ణి ఇంకేదన్నా వృత్తిలో పెడదామనుకుని, వాడితో ఊళ్ళ మీద బయలుదేరాడు.

ఎక్కడా మంగళుడికి పని నేర్పేవాళ్ళు దొరకలేదు. కొన్నాళ్ళయాక, ఒక సాయంకాలం వాళ్ళు పెద్ద మైదానం మధ్య ఉన్న ఒక ఇంటిని చూశారు.

రైతు ఆ ఇంటిని సమీపించే సరికి ఒక మనిషి బయటికి వచ్చి "ఎవరు మీరు? ఏం కావాలి?" అని అడిగాడు.

"నే నొక రైతును. వీడు నా కొడుకు మంగళుడు. వీణ్ణి మీ దగ్గిర పెట్టుకుని మీ వృత్తి నేర్పండి," అన్నాడు మంగళుడి తండ్రి.

"మా వృత్తి ఏమిటనుకున్నావు?" అని ఆ మనిషి నవ్వుతూ అడిగాడు.

"ఏదైనా నాకు అభ్యంతరం లేదు. నా కొడుకు ఏ వృత్తిలోనైనా సరే పైకి రావాలి. అదే నాకు కావలిసింది," అన్నాడు రైతు.

"సరే, మీ వాడికి మా వృత్తి నేర్పి నీ దగ్గిరికి పంపిస్తాం," అన్నాడా మనిషి.

ఇంతకూ ఆ మనిషి ఒక దొంగలముఠా నాయకుడు. అతనితోబాటు నలభైమంది దొంగలు ఆ పెద్ద ఇంట్లో ఉంటున్నారు.

రైతు ఆ రాత్రి దొంగలతోనే గడిపి తెల్లవారగానే తన గ్రామానికి బయలుదేరి వెళ్ళిపోయాడు.

మంగళుడికి దొంగలు చెప్పిన మొదటి పని నీరు తేవటం. వాళ్ళుండే ఇంటికి కొద్ది దూరంలో ఒక వాగున్నది. దాని నుంచి నీరు తెద్దామని మంగళుడు ఒక కడవ తీసుకుని వెళ్ళాడు. వాడు ఆ కడవను నీటిలో ముంచబోతూండగా ఒక స్త్రీ చెయ్యి నీటి నుంచి పైకి వచ్చి ఆ కడవను గట్టిగా పట్టుకున్నది.



మంగళుడు కడవను వదలకుండా పెనుగులాడాడు. ఇంతలో వాడి తల మీద బలంగా దెబ్బ పడింది. చెయ్యి మాయమయింది. కాని తన తల మీద దెబ్బ కొట్టిన పాత్ర వాడికి నీటి ఒడ్డున దొరికింది. మంగళుడు దాన్ని దొంగల వద్దకు తీసుకుపోయాడు.

ఆ పాత్రను చూసి దొంగలు నిర్ఘాంత పోయి, అది ఎక్కడిదని అడిగారు. మంగళుడు వాళ్ళకు జరిగినదంతా చెప్పి, ఎవరిదో ఒక ఆడదాని చెయ్యి తన నెత్తి మీద ఆ పాత్రతో కొట్టిందన్నాడు.

దొంగల నాయకుడు మంగళుణ్ణి కౌగలించుకుని, "ఒరే, నాయనా! ఈ పాత్ర విలువ ఎంతైనా కావచ్చు. న్యాయంగా ఇది నీది. దీన్ని అమ్మామంటే మనం మరి దొంగతనాలు చేసే పని ఉండదు. నీ వంతు వచ్చిన డబ్బు తీసుకుని మీ ఇంటికి వెళ్ళిపోయి, బతికున్నన్నాళ్ళూ హాయిగా ఉండవచ్చు." అన్నాడు.

అతను వెంటనే ఆ పాత్రను తీసుకుని తన గుర్రం మీద నగరానికి వెళ్ళి, ఒక బంగారు వర్తకుడికి దాన్ని చూపి, "దీన్ని ఎంతకు కొంటారు?" అని అడిగాడు.

"దీని వెల నేను ఇచ్చుకోలేను. పెద్ద రత్నవర్తకుడు ఉన్నాడు, అయనకు చూపించు," అన్నాడు బంగారు వర్తకుడు.

రత్నవర్తకుడు ఆ పాత్రను చాలాసేపు పరీక్షించి, "దీన్ని నేను కొంటాను. అయితే దీని ధర రాజుగారు ఎంత అని నిర్ణయిస్తే అంత ఇస్తాను," అన్నాడు.

ఇద్దరూ కలిసి రాజుగారి దగ్గిరికి వెళ్ళారు. రత్నవర్తకుడు రాజుతో, "మహారాజా, కిందటేడు మా దుకాణంలో పడి, ఈ పాత్రనూ, ఇంకా ఇతర వస్తువులనూ దొంగిలించిన దొంగ దొరికాడు," అంటూ దొంగల నాయకుణ్ణి చూపాడు.

"ఈ పాత్ర నీకెక్కడిది? నిజం చెప్పు," అని రాజు దొంగలనాయకుణ్ణి అడిగాడు.



"మా దగ్గిర పని నేర్చుకునేటందుకు చేరిన కుర్రాడికి ఇది వాగు ఒడ్డున దొరికింది," అన్నాడు దొంగలనాయకుడు.

"మీరు చేసే వృత్తి ఏమిటి?" అని రాజు మళ్ళీ అడిగాడు.

"మహారాజా, నిజం చెప్పాలంటే మా వృత్తి దొంగతనం. మేమంతా కలిసి నలభై మందిమి. మా దగ్గిర పని నేర్చుకోవటానికి ఇప్పుడే ఒక కుర్రాడు చేరాడు. వాడికే ఇది దొరికింది," అన్నాడు దొంగలనాయకుడు.

రాజు తన భటులను దొంగ లున్న ఇంటికి పంపించి, మిగతా ముప్పైతొమ్మిది మంది దొంగలనూ, మంగళుణ్ణీ పట్టితెప్పించాడు. మంగళుడు రాజు ముందు వంగి నమస్కారం చేసి, "మహారాజా, నాకే ఈ పాత్ర దొరికింది. తమ సెలవైతే ఏడాదిలోగా ఇలాటి పాత్రలు మరో పదకొండు తీసుకురాగలను. కాని తమరు నగరంలో ఉండే మోసపు వర్తకుల తలలు తీసేస్తానని మాట ఇవ్వండి," అన్నాడు.

"నిన్ను వదిలేస్తాను. నువు వెళ్లి ఏడాదిలోగా ఇలాటి పాత్రలు మరి పదకొండు పట్టుకురా. అంత దాకా ఈ నలభైమంది దొంగలూ బందిఖానాలో ఉంటారు," అన్నాడు రాజు.



మంగళుడు ఆ పాత్రను తన దుస్తులలో దాచుకుని, దొంగలనాయకుడి గుర్రం ఎక్కి, మరొక రాజ్యానికి వెళ్ళి, అక్కడ ఒక పేద రాసిపెద్దమ్మ ఇంట దిగాడు.

"పెద్దమ్మా, ఏమిటి ఈ ఊరి విశేషాలు?" అని మంగళుడు పెద్దమ్మను అడిగాడు.

"ఏమున్నది, నాయనా? మా రాజుగారి కొడుకు నీ యీడువాడే ఈ మధ్య చనిపోతే సమాధి చేశారు. ప్రతి రాత్రీ ఎవరో వచ్చి రాజకుమారుడి శవాన్ని కదిలిస్తున్నారు. రాజుగారు చాలా ఆందోళన పడిపోతున్నారు," అన్నది పేదరాసిపెదమ్మ.



మంగళుడు పెద్దమ్మను వెంటబెట్టుకుని రాజుగారి వద్దకు వెళ్ళి, "మహారాజా, ఈ రాత్రి నేను రాజకుమారుడి సమాధికి కాపలా కాస్తాను, అనుమతి ఇవ్వండి," అన్నాడు.

"కాపలా వాళ్ళేమీ చెయ్యలేకపోయారు. కావలిస్తే నువు కూడా కాపలా కాసి చూడు," అన్నాడు రాజు.

మంగళుడు విల్లంబులు తీసుకుని ఆ రాత్రి రాజకుమారుడి సమాధి వద్దకు వెళ్లి, సమాధికి కొద్ది దూరంలో ఒక చీకటి ప్రదేశంలో దాక్కున్నాడు.

సరిగ్గా అర్ధరాత్రి అయేసరికి మూడు తెల్లపావురాలు ఆకాశం నుంచి సమాధి ముందుకు దిగి ముగ్గురు స్త్రీలుగా మారాయి. ఒక స్త్రీ చేతిలో ఎర్రని బెత్తం ఉన్నది. ఆమె ఒక చిన్న గుడ్డను నేల మీద పరిచి, దాని మీద ఎర్రబెత్తంతో కొట్టి, "వడ్డించు!" అన్నది. వెంటనే ఆ గుడ్డ మీద నాలుగు కంచాలలో భోజనం వచ్చింది.

తరవాత ఆమె సమాధిలోకి వెళ్లి, దాని అడుగున ఉండే రాతి మీద కొట్టి, "తెరుచుకో!" అన్నది.

రాయి పైకి లేచింది. ఆమె దాని అడుగున ఉన్న శవాన్ని బెత్తంతో తాకి, "లేచి రా!" అన్నది.

వెంటనే రాజకుమారుడు ప్రాణాలతో లేచి పైకి వచ్చాడు. తరవాత నలుగురూ కూర్చుని భోజనానికి ఉపక్రమించారు.

అదే సమయమనుకుని మంగళుడు ఒక బాణం ఎక్కుపెట్టి, రాజకుమారుడికి తగలకుండా స్త్రీల మధ్యకు వదిలాడు. వెంటనే ముగ్గురు స్త్రీలూ పావురాలుగా మారి ఎగిరిపోయారు. వాళ్ళు తమ వెంట తెచ్చిన తుండుగుడ్డా, బెత్తమూ అక్కడే ఉండిపోయాయి. మంగళుడు వాటిని తీసుకుని, రాజకుమారుడితో, "ఇంక నీకు ఈ సమాధితో ఏం పని? మీ ఇంటికి పోదాం పద!" అన్నాడు.

—(ఇంకావుంది)






# 2

చచ్చిపోయిన కొడుకు ప్రాణాలతో తిరిగి వచ్చేసరికి రాజు పొందిన ఆనందం అంతా ఇంతా కాదు. ఆయన మంగళుడితో, "నాయనా, నీ రుణం ఎలా తీర్చుకోవాలో తెలీదు. నీకేం కావాలో అడుగు. సాధ్యమైతే ఇస్తాను," అన్నాడు.

మంగళుడు తన వద్ద ఉన్న పాత్ర పైకి తీసి, "ఇలాటివి ఇంకా పదకొండు పాత్రలు కావాలి," అన్నాడు.

"అది నాకు అసాధ్యం, నాయనా!" అన్నాడు రాజు.

"నాకు మరేమీ అవసరం లేదు," అంటూ మంగళుడు తన గుర్ర మెక్కి బయలు దేరాడు.

కొంతకాలం ప్రయాణించి అతను సముద్రతీరాన గల ఒక నగరం చేరుకుని, ఒక ఇంటికి వెళ్ళాడు.

ఆ ఇంటి యజమాని మంగళుణ్ణి చూసి "బాబూ, నీకు ఆతిథ్యం ఇవ్వలేను. మేం ఇంటిల్లి పాతీ పస్తులుంటున్నాం. ఈ నగరంలో ఎక్కడా నీకు పట్టెడు అన్నం పుట్టదు. మాకు కరువు వచ్చింది," అన్నాడు.

"నేను మిమ్మల్ని తిండి అడగను," అంటూ మంగళుడు తన వద్ద ఉన్న తుండు గుడ్డ తీసి నేలపైన పరిచి, దాని మీద బెత్తంతో కొట్టి, "వడ్డించు!" అన్నాడు. వెంటనే విందు భోజనం వచ్చింది.

"మీ వాళ్ళందరినీ భోజనానికి పిలవండి," అన్నాడు మంగళుడు ఇంటి యజమానితో.

మంగళుడి ధర్మమా అని ఇంటిల్లి పాతీ సుష్టుగా భోజనం చేశారు.

"మీకు కరువు రావటానికి కారణ మేమిటి?" అని మంగళుడు ఇంటి యజమానిని అడిగాడు.



"మా దేశంలో తగినంత ఆహారధాన్యాలు పండవు. అందుచేత మేం వాటిని సముద్రం మీద తెప్పించుకుంటాం. కాని ఈ మధ్య ఒక అదృశ్యహస్తం మా ధాన్యపు ఓడలను ముంచేసి, మాకు తిండికరువు కలిగిస్తున్నది. ఏం చెయ్యాలో మాకు తోచటం లేదు," అన్నాడు ఇంటి యజమాని.

"ఏం చెయ్యాలో నాకు తెలుసు. మీ రాజుగారి దగ్గిరికి పోదాం," అన్నాడు మంగళుడు. ఇద్దరూ రాజు వద్దకు వెళ్ళారు.

"రాజా, మీ ధాన్యపు పడవలు క్షేమంగా చేరేటట్టు నేను చూస్తాను. నాకేమిస్తారు?" అని మంగళుడు రాజును అడిగాడు.

"నీకేం కావాలంటే అది ఇస్తాను," అన్నాడు రాజు.

మంగళుడు నలభై పడవలను వెంట బెట్టుకుని సముద్రం మీద వెళ్ళి, వాటిని ధాన్యంతో నింపుకుని తిరిగి వస్తూండగా, అకస్మాత్తుగా ఒక స్త్రీ చెయ్యి సముద్రంలో నుంచి పైకి వచ్చింది. ఆ చేతికొక బంగారు కడియం ఉన్నది.

మంగళుడు ఆ చెయ్యి పట్టుకుని విదిలించి, అవతలికి తోసేశాడు. చెయ్యి నీటిలో మునిగిపోయింది గాని, చేతికి ఉన్న కడియం అతని చేతిలోకి ఊడి వచ్చింది.

కాటకం తొలగిపోయింది. ప్రజలు కడుపు నిండా తిన్నారు.

రాజు మంగళుడితో, "నీకు ఏమి బహుమానం కావాలో కోరుకో, ఇస్తాను," అన్నాడు.

మంగళుడు తన పాత్ర పైకి తీసి, "ఇలాటివి ఇంకా పదకొండు కావాలి," అన్నాడు.

"నా రాజ్యమంతా అమ్మినా ఆలాటి పాత్ర రాదు. కావలిస్తే నా కూతురిని పెళ్ళాడు. నా నగరం ఇస్తాను తీసుకో," అన్నాడు రాజు.

"నాకు ఇలాటి పాత్రలు తప్ప ఇంకేమీ వద్దు. నా సోదరులు నలభైమంది కారా

గృహంలో మగ్గుతున్నారు. వాళ్ళను తలచుకుని నేను కన్ను మూయలేకుండా ఉన్నాను," అన్నాడు మంగళుడు.

"నేను నీకు ఒక సహాయం చెయ్యగలననుకుంటాను. రేపు ఉదయం కనపడు," అని రాజు మంగళుడితో చెప్పి, తన నౌకా దళాధికారిని పిలిపించి, "యక్షరాజకుమార్తెలు భోజనాలు చేసే చోటు నీకు తెలుసును గద?" అన్నాడు.

"తెలుసు, మహారాజా!" అన్నాడు నౌకా దళాధికారి.

"రేపు మంగళుణ్ణి అక్కడికి తీసుకుపోయి, ఆ స్థలం చూపించు," అన్నాడు రాజు.

మర్నాడు ఉదయం మంగళుడు వచ్చాడు. రాజు అతనితో, "నేను నిన్ను యక్షిణులు భోజనాలు చేసే చోటికి పంపుతాను. వాళ్ళు నీకు నువు కోరినటువంటి పాత్రలు ఇవ్వవచ్చు," అన్నాడు.

మంగళుడు తన గుర్రాన్ని తానున్న బసలోనే వదిలి, రాజుగారి నౌకలో బయలుదేరాడు. ఏడురోజులు ప్రయాణం చేసి వారు అవతలి తీరాన్ని చేరారు. నౌకాదళాధిపతి మంగళుడికి దూరంగా ఉన్న ఒక కోటను చూపించి, "అదే, యక్షిణుల కోట," అన్నాడు. మంగళుడు నౌక దిగి కోటలోకి ప్రవేశించాడు. లోపల ఒక ముసలివాడు



వంట చేస్తున్నాడు. "ఎవరు, బాబూ, నువ్వు? యక్షిణులు వచ్చే వేళ అయింది. వాళ్ళ కంటపడితే ప్రమాదం. ఆ తెరల వెనక దాక్కో," అన్నాడా వంటవాడు.

మంగళుడు వెంటనే పోయి తెరల చాటున దాక్కున్నాడు.

కొద్ది సేపటిలో యక్షరాజు కుమార్తెలు ముగ్గురు వచ్చారు.

"వంట సిద్ధమయింది. వడ్డించమంటారా, అమ్మాయిలూ?" అన్నాడు వంటవాడు.

ముగ్గురూ భోజనాలకు కూర్చున్నారు.

అదీయిదీ మాట్లాడుతూ, మధ్యలో ఒక యక్షిణి ఇలా అన్నది:

"ఆ నలభైమంది దొంగలూ ఏడేళ్లపాటు వాగులో నీరు తాకకుండా ఆపగలిగాను. ఇంతలో ఎవడో కుర్రాడు వచ్చి నా చేతిని పట్టేసుకున్నాడు. చెయ్యి విడిపించుకోవటానికి అతన్ని పాత్రతో కొట్టవలిసి వచ్చింది. భలేవాడు!"

రెండో యక్షిణి వెంటనే, "నా మంత్ర దండం కాజేసి, చచ్చినవాళ్ళను బతికించినవాడేమన్నా తక్కువ వాడా?" అన్నది, నిట్టూర్చుతూ.

వెంటనే మూడో యక్షిణి, "నా చేతిని తోసేసి, ధాన్యపు నౌకలను తీసుకుపోయి, నా చేతిలో ఉన్న నగరాన్ని విడిపించిన కుర్రాడెంతటి వాడై ఉండాలి!" అన్నది మరింత గట్టిగా నిట్టూర్చి.

ఈ మాటలను విన్న మంగళుడు తెరల చాటు నుంచి ముందుకు వచ్చి, "ఆ కుర్రాడు మీ ఎదటపడితే వాడికేమి ఇస్తారు?" అన్నాడు.

"ఏం కావాలంటే అది ఇస్తాం!" అన్నారు ముగ్గురు యక్షిణులూ ఒక్కసారిగా.

ముగ్గురూ ఒక్కసారే మంగళుణ్ణి గుర్తించి, ఆశ్చర్యపోయారు. వాళ్ళు అతన్ని తమ సరసను కూర్చోబెట్టుకుని, "ముందు మాతో కలిసి భోజనం చెయ్యి," అన్నారు.

—(ముగింపు వచ్చే సంచికలో)





# ముగ్గురు యక్షిణులు

## 3

వాళ్ళు భోజనం చేస్తూండగా యక్షరాజు తన కుమార్తెలకు దూత ద్వారా ఒక సందేశం పంపాడు. భోజనాలు పూర్తికాగానే ఆ దూత పెద్ద యక్షిణికి ఒక ఉత్తరం ఇచ్చాడు. ఆమె దాన్ని చదివి కంట నీరు కార్చ సాగింది. రెండవ యక్షిణీ, మూడవ యక్షిణీ కూడా ఆ ఉత్తరం చదువుకుని కన్నీరు కార్చనారంభించారు.

అది చూసి మంగళుడు యక్షిణులతో, "ఆ ఉత్తరం చదివి మీరెందుకు అంతగా దుఃఖిస్తున్నారు? అందులో. ఏమున్నది?" అని అడిగాడు.

"మా అన్నను వృషభాసురుడు ఎత్తుకుపోయాడు. అతన్ని విడిపించటం సాధ్యం కాలేదుట," అన్నది పెద్ద యక్షిణి.

"దేవుడు మేలు చేస్తే నేనే విడిపించగలను. కాని కారాగృహంలో ఉన్న నా నలభై మంది అన్నల మాటేమిటి? వారిని ఎవరు కాపాడుతారు? ఇలాటి పాత్రలు ఇంకా పదకొండు సంపాదించి, వెంట తీసుకుపోతే గాని వారికి విముక్తి కలగదు," అన్నాడు మంగళుడు.

"ఈ ముష్టి పాత్రల కోసం బెంగపడతావేమిటి? ఇలాటివి ఎన్ని కావాలంటే అన్ని ఇస్తాం. ఇక ఆ గొడవతేకు, సరా!" అన్నారు యక్షిణులు.

"అలా అయితే నా ప్రాణాలు కూడా కాపాడినవాళ్లవుతారు. నన్ను మీ తండ్రిగారి దగ్గిరికి తీసుకుపొండి," అన్నాడు మంగళుడు.

అందరూ కలిసి యక్షరాజు వద్దకు వెళ్ళారు.

మంగళ్ళుడు రాజుకు వందనం చేసి, చేతులు కట్టుకుని నిలబడ్డాడు.



"ఈ మానవమాత్రుణ్ణి ఇక్కడి కెందుకు తెచ్చారు?" అని యక్షరాజు తన కుమార్తెల నడిగాడు.

"ఇతను అన్నను వృషభాసురుడి నుంచి రక్షిస్తాడు," అన్నారు యక్షిణిలు.

"నిజమా? నువు నా కొడుకును ఆ రాక్షసుడి నుంచి కాపాడగలవా?" అన్నాడు యక్షరాజు.

"ప్రయత్నిస్తాను," అన్నాడు మంగళుడు.

"ఈ వృషభాసురుణ్ణి నువు చూశావా?" అని రాజు అడిగాడు.

"లేదు," అన్నాడు మంగళుడు.

యక్షరాజు మంగళుడికి తన వద్ద ఉన్న గుర్రాలలో అతనికి కావలసినది ఏరుకోమన్నాడు; తన సొంత ఖడ్గమూ, డాలూ, విల్లూ, గదా ఇచ్చాడు; తరవాత ఆయన తన సేనానాయకుడితో, "ఈ కుర్రవాణ్ణి వృషభాసురు డుండే కొండ దగ్గిర దిగబెట్టిరా!" అన్నాడు.

మంగళుడు తాను ఎన్నుకున్న గుర్రం మీదికి ఎగిరి దూకాడు. అది చూసి యక్షరాజు, "కుర్రవెధవ నెగ్గేటట్టే ఉన్నాడు!" అనుకున్నాడు.

యక్షసేనాపతి మంగళుడి వెంట వృషభపర్వతం దాకా వెళ్ళి, "ఈ కొండ మీదనే వృషభాసురు డుండేది. నువ్వు కొండ మీదికిపో. నేనిక ముందుకు రాను, తిరిగిపోతాను," అన్నాడు.

మంగళుడు అతనికి వీడ్కోలు చెప్పి, గుర్రాన్ని కొండ మీదికి దౌడు తీయించాడు. గుర్రం రాక్షసుడి కోటద్వారం ముందు ఆగింది.

"ఒరే, నాతో యుద్ధానికి రా!" అంటూ మంగళుడు పెద్దగా కేక పెట్టాడు.

ఇద్దరు ద్వారపాలకులు ద్వారం తెరుచుకుని బయటికి వచ్చి, మంగళుడి కేసి ఈసడింపుగా చూసి, అతన్ని లోపలికి వెళ్ళకుండా అటకాయించారు.

మంగళుడు కత్తి దూసి ఇద్దరి తలలూ నరికేసి, వాటిని కిటికీల కుండా లోపలికి విసిరివేశాడు.

ఆ చప్పుడుకు వృషభాసురుడు నిద్ర లేచి, కిటికీగుండా మంగళుణ్ణి చూశాడు. వెంటనే అతను తన ఆయుధాలు తీసుకుని బయటికి పరిగెత్తి వచ్చాడు.

ఇద్దరూ ద్వంద్వయుద్ధం ఆరంభించారు. రాక్షసుడు తన గదను మంగళుడి పైకి విసిరాడు.

అది గురి తప్పి కింద పడి, భూమి దద్దరిల్లేటట్టు చేసింది. మంగళుడు దాన్ని తీసుకుని రాక్షసుడి మీదికి వేస్తూ, "యుద్ధం చెయ్యక ఆటలాడటా వేమిటి?" అన్నాడు.

వృషభాసురుడు మంగళుడి మీదికి వరసగా ఏడు గదలను విసిరాడు, ఏడు బాణాలు గురిచూసి వదిలాడు. ఏ ఒక్కటీ మంగళుడికి తగలలేదు.

"ఆగు! ఇక నా వంతు!" అంటూ మంగళుడు తన కత్తితో రాక్షసుడి కంఠాన్ని నరికాడు. రాక్షసుడి తల కింద పడి, కొండ కిందికి దొర్లుకుంటూ పోయింది.

మంగళుడు తన గుర్రాన్ని బయట కట్టేసి, కోట లోపలికి వెళ్ళి, యక్షరాజు కుమారుణ్ణి బంధవిముక్తుణ్ణి చేసి, "పద, మీ నాన్నగారి దగ్గిరికి పోదాం," అన్నాడు.

ఇద్దరూ గుర్రాలెక్కి యక్షరాజుండే చోటికి బయలుదేరారు. దారిలో యక్ష యువరాజు మంగళుడితో, "మా నాన్న నిన్ను ఏదన్నా కోరుకోమంటే, మా ఆఖరు చెల్లెలిని భార్యగా కోరుకో; ఆయన చేతిన ఉన్న ఉంగరం కూడా అడుగు. మరిచేవు సుమా!" అన్నాడు.



క్షేమంగా తిరిగి వచ్చిన తన కుమారుణ్ణి చూసి యక్షరాజ దంపతులు పరమానంద భరితులయారు.

రాజు మంగళుడితో, "నీ కేం బహుమానం కావాలో కోరుకో, తప్పక ఇస్తాను," అన్నాడు.

"మహారాజా, నా కోరిక తీర్చదలిస్తే మీ మూడో కూతురిని నాకు భార్యగా ఇవ్వండి; మీ వేలిన ఉన్న ఉంగరం ఇవ్వండి; ఇలాటి పాత్రలు పదకొండు ఇప్పించండి," అన్నాడు మంగళుడు.

"తప్పక ఇప్పిస్తాను. నువు వాటిని పుచ్చుకో దగినవాడివే!" అన్నాడు యక్షరాజు నవ్వుతూ.

మంగళుడికీ, మూడో యక్షిణికీ పెళ్ళి జరిగింది. వివాహమహోత్సవాలు ఏడు రోజులపాటు సాగాయి. ఎనిమిదో రోజున మంగళుడు పన్నెండు పాత్రలూ కట్టుకుని తన భార్యతో సహా బయలుదేరాడు.

అతను తన రాజధాని చేరేనాటికి సంవత్సరం పూర్తి అయిపోయింది. నలభైమంది దొంగలకూ శిరశ్ఛేదం చేసే ప్రయత్నం సాగుతున్నది.

"ఆగండి!" అంటూ మంగళుడు వచ్చి, మూట విప్పి, "ఇవిగో, మీరు కోరిన పాత్రలు!" అని పన్నెండు పాత్రలనూ ఒక దాని పైన ఒకటి పేర్చి రాజు ముందు పెట్టాడు.

రాజు వర్తకుణ్ణి పిలిపించి, "ఈ పాత్రలలో నీ పాత్ర ఏదో పోల్చగలవా?" అని అడిగాడు.

వర్తకుడికి ఆ పాత్ర లన్నిటినీ చూసి తల తిరిగిపోయింది. అతను ఏమీ చెప్పలేక పోయాడు.

రాజు నలభైమంది దొంగలనూ విడిచి పుచ్చి, మోసకారి అయిన వర్తకుడి తల తీయించేశాడు. తరవాత నగరంలో ఉన్న వర్తకు లందరిని రాజు విచారించి, వారిలో మోసగాళ్ళను అందరినీ దేశం నుంచి వెళ్ళగొట్టాడు.

తరవాత రాజు మంగళుణ్ణి యువరాజుగా అభిషేకిస్తే, ప్రజలందరూ హర్షించారు.

—(అయిపోయింది)

